సంపుటము 2]  జూన్ 1916  [సంచిక 12

# బాలమిత్ర



## ఇంటిలో తోట నాటుట

ఆహా! నాతోట నిప్పుడే నాటుకొంటే ఎంత బాగుండును. అమ్మా! ఇవిగో చూడు! ఇదెంత మంచి పఠమో. అని ఒక పుస్తకమును చూపుచు గోపాలుడు తల్లితో ననెను.

"ఇప్పుడే ఎందుకు వేయకూడదు? అవి పెరుగుట ఎంతో తమాషాగా ఉండును." అని తల్లి చెప్పెను.

గోపాలుడు కిటికీగుండా చూచెను. బైట అంతయు హిమముపడి నేల తెల్లగా నుండెను. వారు ఉత్తరముగా హిమాలయ పర్వతములయొద్ద కాపుర ముండిరి. అక్కడ చలికాలమంతయు నేలపైన తెల్లని హిమము పేరుకొనిపోయి గడ్డకట్టును. అప్పుడేమాత్రమును భూమి కనుబడదు.

"ఈ కాలము ఏతోట వేయవలెను! హిమముచూడు. భూమిపైన ఏలాగున ఉన్నదో."

"అయినా పరవాలేదు. కొద్ది రోజులలో పచ్చటి తోట వచ్చును. ఏలాగు వేయవలెనో చూపించెదను. మొదట విత్తనములను గోరు వెచ్చనీటిలో నానబెట్టుము." అని తల్లి చెప్పెను.

గోపాలుడు విత్తనములు తెచ్చుటకు లోనికి పరుగెత్తెను. అతడు తిరిగి వచ్చునంతలో వాని తల్లి ఒక పెద్ద పళ్లెములో దూదిని పరచెను.

"విత్తనములు మెత్తనైన పిదప వాటిని రెండు దూది పొరల నడుమనుంచి బాగుగా తడపవలెను. తరువాత వాటిని సూర్య కిరణములు తగులు కిటికీయొద్ద పెట్టుదము."

“కొన్ని దినములలోనే నీ తోటను చూడవచ్చును.” అనెను తల్లి. భూమిలో పాతిపెట్టకపోతే, విత్తనములు మొలక లెత్తవని అతడు అనుకొనెను. అయినను తల్లి చెప్పిన చొప్పున దినదినము వాటిని జాగ్రతగా కనిపెట్టుచు వచ్చెను. కొన్ని దినములలో మొలకలువచ్చెను. గోపాలుని ఆశ్చర్యమునకు మితము లేకపోయెను. విత్తనములలో, చిన్ని మొక్కలకు కొద్ది దినములవరకు కావలసినంత భోజన ముండుననియు మొదట మొక్కలకు భూమి అంత అవసరము లేదనియు తల్లి చెప్పెను.

గోపాలుని చెట్లు పెద్ద వృక్షములు కాలేదు. అయినను వాటివలన కలిగిన సంతోషము చాల గొప్పదైయుండెను. తరువాత వెంటనే అతడు వేరు చిన్నతోటలను వేయసాగెను. బఠాణీ గింజలు, మొక్కజొన్నలు వీనిని బుడ్డలోవేసి దానిలో తడిదూది ఉంచినయెడల ఆ మొక్కల వేళ్లును, ఆకులు పెరుగుట చూడవచ్చునని కనుగొనెను.

గోపాలు డాలాగున కనుగొనిన సంగతులు కొద్దిమాత్రమే. గాని వానితల్లి కాలక్రమేణ యింకా అనేక సంగతులు వానికి తెలియవచ్చునని చెప్పెను.



# అతి శ్రేష్ఠమైన దేద్ది?

ఒక గొప్ప రాజుండెను. తన మంత్రులలో ప్రధానిని జూచి, యీ లోకములో నున్నవానిలో అతి శ్రేష్ఠమైనదాని దెచ్చి తన కిమ్మనెను. అతడాలోచించి కొన్ని గంటలైనవెనుక నొక నాలుకను పళ్లెములోబెట్టి రాజుగారి కిచ్చెను. "దీని నెందుకు తెస్తివ"ని రాజడుగ, నతడు "మహా ప్రభూ! దీనితో మనమతి శ్రేష్ఠమగుమాటల బలుకుచు, అతి శ్రేష్ఠకార్యముల జేయించవచ్చు" ననెను.

తరువాత రాజుగారు మఱొక మంత్రినిబిలిచి, లోకములో నున్నవానిలో నతిహీనమైనదాని దెమ్మనెను. అతడు గూడ నొక నాలుకనే దెచ్చియిచ్చె. రాజుగారు కారణ మడుగ, "దీని ద్వారా కడుదుర్మార్గపు మాటలుపలికి, కత్తి కన్న పదునైన మాటలతో నితరుల గాయపరచ వచ్చును గాన నిదియే అతి నీచమైనది" అనెను. రాజా ప్రత్యుత్తరముల కెంతయు సంతసించెను. మన నాలుక ఏరకములో జరియున్నది? అతి శ్రేష్ఠమైనదై దేవుని కొఱకెల్లప్పుడు నుపయోగింపబడునదై యుండుగాక.

# డాక్టరు సంతోషము



నేను పెద్దవాడ నైనప్పుడు డాక్టరు నౌతాను. మా పెదయ్య ప్రకాశముగారు ఒక డాక్టరా యిప్పుడు. నేను పెద్దవాడనైతే, ఆయనలాగే కావాలి అని కాంతయ్య అనెను.

"సరే, నీవు డాక్టరువు కాగోరుచున్నావా? నీవంటి పిల్లవాడే నాకు కావలెను. ఇట్లూరా" అని వాని పెదయ్య ప్రకాశము డాక్టరనెను.

తన జేబులోనుంచి ఒక కమలపండు దీసి వాని జేబులో పెట్టి "ఇదిగో దీని తీసికొనిపోయి, ఈవీధి చివరనున్న పెద్దయింటి కెదురుగానున్న గుడిసెలో ఒక పిల్లవాని కాలువిరిగి

యున్నది. వానికిచ్చి, వాని నవ్వించి రాగల వేమో చూడు." అని చెప్పెను.

కాంతయ్య దాని తీసికొనివెళ్లి చాల సేపటికి వచ్చెను.

"డాక్టరు సంతోషమ్, ఏమి వచ్చినావా? ఎట్లున్నది?"

"అతడు బాగగువరకు ప్రతిదినము వెళ్లివచ్చెదను."

"అట్లయితే కాంతయ్యను నాబండిలో ఎక్కించుకొని వెళ్లవలెను కాబోలు. రోగుల కెవరికైనా చిరాకుగానుంటే ఈ డాక్టరు సంతోషముగారిని వారియొద్దకు పంపుతానని" పెద్దయ్య చెప్పెను.

---

# ప్రకృతి పాఠములు

## 23-వ పాఠము

### దంతములనుగూర్చి మఱికొన్ని సంగతులు

నీ నోటిలోతిరగటిలో నానావిధములగు పళ్లున్నవి గుర్తించుము. వాటిలో ప్రతిరకమునకొక ప్రత్యేకపు పని గలదు. ముందటిపళ్లు భోజనమును కొరుకుట కుపయోగించును. వెనుకనున్న పెద్దదంతములు దానిని నమలి పిండి చేయుట కుపయోగించును. సన్నముగను పొడవుగనుండు కోరపండ్లు భోజనమును చీల్చుట కుపయోగించును.

ఈ వేరువేరుపళ్లను మన మాఁయాఁమ్మృగాదులలో చూడగలము. ప్రతిజంతువు తినునట్టి మేతనుబట్టి దానిపండ్లున్నవి. పిల్లియు కుక్కయు తమ మేతను చీల్చి తినవలెను గాన వానికి సన్నని పొడవైన కోఱపండ్లు గలవు. అదేలాగున పెద్దపులికి సింహమునకును అట్టివే పెద్దవిగలవు. అయితే ఆవునోటిని కొంచెము గుర్తింపుడు. దానికి కోరపండ్లు లేవే. ఎందువలన? అది తాను తినుగడ్డిని చీల్చ నవసరములేదు. దానిని నలగగొట్టి నమలవలసియున్నది. గాన యిందుకై దానికి వెడల్పయిన పెద్దపండ్లు గలవు. ఇవి దానినోటిలో వెనుకనున్నవి.

గాని దాని నోటి ముందరిభాగమున మరియొక తరహా పళ్లుకూడా గలవు. వీటిసహాయముచే నది మేతను కొఱికి తినును. ఆవు గడ్డితినుచుండగా కొంచెము నిదానించి చూడుము. మొదట అది తన ముందఱిపండ్లచే కొఱికి నాలుకతో దవడలక్రిందికి నెట్టును. అక్కడ అది కడుపులోకి పోక ముందు దాని నమలును. గనుక ఆవునోటిలో కోసే మరయు, తిరగలియు నున్నవి. గుఱ్ఱమునకుకూడా ఈతరహా పండ్లున్నవి.

నీ వేదయినా కాయనుగాని, పండునుగాని తినునప్పుడు ఆవుగాని గుఱ్ఱముగాని గడ్డిని తినునట్లే చేతువు. మొదట ముందరిపండ్లతో కొఱికి తరువాత దంతములతో నమలి మ్రింగకపూర్వము మెత్తగా చేయుదుము.

ఆ వెల్లప్పు డేవిధముగా తన ముందఱిపండ్ల నుపయోగింపదు. చొప్పనుగాని వరిగడ్డినిగాని తినునప్పుడు లక్షించుము. అప్పుడు కొరకదుగాని ముందటిపండ్లచే లోపలకు లాగుకొని నములును. ఒక వాముమీదబడి తినునప్పుడు ముందరి పండ్లతోలాగి తినుచుండునుగాని కొఱకదు.

ఈ పటములో కనుబడు చక్కని మృగముపేరు తెలియునా? దానికికూడా అట్టితరహాపండ్లే గలవు. దీనిపేరు జిరాఫీ లేక పులి యొంటె. బాగుగా పెఱిగిన జిరాఫీ మిక్కిలి ఎత్తుగా నున్న మనుష్యునికి మూడు రెట్లుండును. అదివంగి గడ్డిమేయుట కష్టము గాన చెట్ల ఆకులు తిని జీవించును.



నీ పళ్లు పిల్లి, కుక్క, పులి మొదలగు జంతువులంత పెద్దవియు, వాడివియు కాదు. ఎందువలన? నీ భోజనమును నీవు తినుటకు

తగినరీతిగా చేసికొనుటకు కావలసినబుద్ధిని ఉపాయముగల మనస్సును దేవుడిచ్చినాడుగాని వానికా తెలివిలేనందున వానికి వలయుసాధనములనే యిచ్చియున్నాడు.

ఆవు గడ్డినిగాని, చొప్పనుగాని రెండుసారులు నమలును. గొర్రెలు, ఒంటెలు, జిరాఫీ, ఇంకా అనేకజంతువులు ఈలాగుననే చేయును. అవి మొదటిసారి తినునప్పుడు గబగబమని తమపొట్ట నింపుకొనును. తరువాత ఒకచెట్టుక్రిందనో, సాలలోను నెమ్మదిగా పరుండి కండ్లు కొంచెము మూసికొని, తమకంటె సౌఖ్యవంతు లెవరును ఈ లోకమందు లేనట్లు రెండవసారి నమలును. మళ్లీ ఏలాగది నోటిలోకి వచ్చునో తెలియునా? చెప్పెద వినుము.

ఆవునకు నాలుగు కడుపులున్నవి. మొదటిదానిలోకి తిన్న గడ్డి యావత్తుబోయి చేరును. తరువాత అది రెండవ కడుపులోకివెళ్లి మెత్తబడి, తడుపబడి, చిన్నచిన్న ఉండలుగా నగును. అది నెమ్మదిగా ఒకచోట పరున్నపిదప ఈ ఉండలు ఒక్కొక్కటిగా నోటిలోకి మరలవచ్చును. అప్పుడది దానిని రెండవమారు నెమ్మదిగా నమలి పిండిచేసి, మూడవ కడుపులోనికి పంపును. తరువాత అది జీర్ణమై రక్తముగా మారుట కారంభించును. దీనికే నెమరువేయుట అందుము. ఆవు నెమరువేయునప్పుడు దానినోటిని, గొంతును మెడను కొంచెము

గుర్తించి చూడుము. ఉండ నోటిలోకి వచ్చుట పోవుట ఎంత గమ్మత్తుగా నుండునో చూతువు.

పక్షులకు పళ్లులేవు. తిరగలి వాటికి నోటిలో కాదుగాని కడుపులో నున్నది. కోడి మేత తినునప్పుడు చూడండి. ఎంత త్వరగా తినును! అంతా ఎక్కడకు పోవును? ఒక పెద్ద సంచిలోకి ఇక్కడది తడుపబడి మెత్తనై మరియొక తిత్తిలోకి బోవును. ఈ తిత్తిలో రెండు కఠినమైనభాగము లున్నవి. వీటిమధ్యబడి అది మెత్తగా పిండివలె నగును. పళ్లెట్లుపని కుపయోగించునో పక్షుల కీ తిత్తి అందుల కుపయోగించును. అన్నిపక్షుల కిది యుండదు. కొన్నిటికి సాధారణమైన కడుపే యుండును. పక్షులు తినుమేతనుబట్టి ఇవియుండును.



# నీమనస్సు నుపయోగించుము

చదువుకొనుటకై జంతువులకు దేవుని ధర్మములను గూర్చి తెలిపెడి గ్రంథమేదియును లేదు. దేవునితో మాట్లాడు నట్లుగా కుక్కకు నేర్పగలవా? ఇవి యసాధ్యపు పనులు గాని చిన్ని బిడ్డలు మాటలాడుట కారంభింపగానే, "ఓ ప్రభువా నిన్ను ప్రార్థించుచున్నాను" అనియు "ఆకాశమం దున్న మా తండ్రీ" యనియు చెప్ప నేర్చుకొనుచున్నారు.

చిన్నిబిడ్డ మనసు మంచి చెడుగులనుగూర్చి గుర్తెరుగునట్లును, మంచిదాని నేర్పరచుకొనునట్లును తల్లి దానికి నేర్పుచున్నది. ఎత్తైనస్థలమునుండి పడుటవలన తలకు దెబ్బతగిలి పిచ్చి పిచ్చి పనులుచేయు బిడ్డను నీవు చూచి యుండవచ్చును. వారి తల్లులేమని చెప్పుదురు? "ఆ బిడ్డ నలక్ష్యపెట్టకుము. దాని తలకు మంచి దెబ్బతగిలినందున దాని మనస్సు నీదానివలె సరిగా తలంచనేరదు. దాని మెదడు సరిగా లేద"నును గదా. వానివలె ఉండుట నీకిష్టమా? లేనియెడల నీ మెదటిని సరిగా నుపయోగించవలెను. అప్పుడది దేవుడు చెప్పు పనులను సరిగా చేయు సహాయపడును. అట్లు గాకున్నయెడల నీవుకూడా పిచ్చివాడవుగా నుండుటయే మంచిది.

---

# బైబిలు పిల్లలు

## మోషేను కనుగొనుట

బాలమిత్రులారా! మార్చినెలలో మనము మోషేయను చిన్నబాలుని కథను కొంచెము చదివియున్నాము. ఆ చిన్నబాలుడు నైలు నదీతీరమందలి జమ్ముపెట్టెలో మూడు మాసములు ఎవరికి తెలియకుండా దాచిపెట్టబడెను. పూర్వ

కాలము మనదేశపు రాచపుత్త్రికలు తమ చెలికత్తెలతో కలసి నదులకు, సెలయేళ్లకు, పోయి, సంతోషముతో స్నానము చేయు వాడుక కలదు. ఈరీతిగా స్నానము చేయుటకు ఫరోకుమార్తె తన చెలికత్తెలతో నైలు నదికివచ్చెను. స్నానము చేయువాడుక స్థలమును సమీపించుచుండగా, నా రాచపుత్త్రికకు చిన్నబిడ్డ ఏడ్పు వినబడెను. ముందుకు సాగు కొలది, మరీదగ్గరగా ధ్వని వినబడుచుండెను. కొంతసేపు ఆమె చెలికత్తెలతో నిలచి, యెటువైపునుండి ఏడ్పుధ్వని వినబడుచున్నదాయని యుచ్చటించుచుండ, బిడ్డయున్న స్థలము తెలియవచ్చెను. కాని ఏమియు కానరాదాయె. దట్టముగా జమ్ము పొదమాత్రము కాన్పించెను. ధ్వని యచ్చటనుండియే గలుగుచున్నందున వారలు ఆపొదను పదేపదే పరికించిచూచు సరికి, సొగసైన చిట్టిపాప ఒక జమ్ముపెట్టెలో నుంచబడుటయు, వాడాకలిగొని యేడ్చుటయు తెలియవచ్చెను. పాపము! ముద్దులబిడ్డడు యేడ్చుయేడ్పు రాచపుత్త్రిక చూడలేకపోయెను. ఆ పిల్లవానిపై ఆమెకు దయ పొర్లివచ్చెను. చూచుకొలది వాని సౌందర్యము హెచ్చసాగెను. అంత నా రాచపుత్త్రిక ఆ సుందరబాలుని తన స్వీయముగా పెంచుకొన నిష్టపడి, తన చెలియలతో వాని తన ఇంటికి కొనిరమ్మని యాజ్ఞాపించెను. బిడ్డకును యాకలిహెచ్చు, అరుపును అధిక

ముగా హెచ్చసాగెను. వారికి యేమిచేయుటకు తోచదా యెను. అంతలో నొక అమ్మాయి అచ్చట ఆడుకొనుచు వారి దగ్గరకువచ్చి "అమ్మా! పిల్లవాడు ఆకలిగొని అట్లు అరచు చున్నాడు అదిగో! ఆ పాలెమునకుపోయి పాలివ్వగల ఒక పెద్దమనిషిని పిలుచుకొనివత్తునా? యని" అడుగ వారు మిగుల సంతసించి "సరే త్వరగా పిలుచుకొని రమ్మనిరి." బాల మిత్రులారా! ఈ అమ్మాయి ఎవరో మీకు తెలియునా? ఆమెపేరు మిరియము, దాచబడిన సుందర బాలుని అక్కయే. తల్లి ఆజ్ఞప్రకారము తమ్మునికి బహు నేర్పరితనముగా కాపు గాయుచూ, పరుల కామె వేడుకగా ఆడుకొనుచున్నట్లు కన్పించునది. బిడ్డ దాచబడినది బయలుపడిన తర్వాత మిగుల జ్ఞానముతో ఏమియు తెలియనట్లు రాచకుమార్తెయొద్ద నటించి నమ్మకము పుట్టించుకొని, పాలిచ్చుటకు తన తల్లినే రాచ పుత్రికకడకు తెచ్చిన బుద్ధిశాలియగు బాలిక, ఈసద్బాలిక పాలిచ్చు దాదితో బహుత్వరగా రాచపుత్రిక యొద్దకువచ్చి, ఆమె కా దాది నప్పగించెను. అంత నా రాచపుత్రిక ఆమెతో ఆబిడ్డకు దాదిగానుండి, వాని పోషించిన తగు బత్తెమిత్తునని చెప్పి ఆబిడ్డ నామె కప్పగించెను.

చూచితిరా? దైవము మన పక్షముగానున్న మన కెవ రును విరోధముగా నుండరని యీ కథ నేర్పుచున్నది. పరో

ఆజ్ఞకు వ్యతిరిక్తముగా దాచబడినను న్యాయస్థుడగు దేవుడు తన్ను నమ్మినభక్తుల పరోక్షమాత్రె ద్వారానే ఆదరణ ధైర్యముల గలిగించెను.

---

# బాలమిత్ర టపా




ప్రియ బాలమిత్రులారా!

బాలమిత్ర సంపాదకురాలు గారియొక్క దివ్య సముఖమునకు, మీరు వ్రాసిన బాలమిత్రను మేము మా

స్నేహితులమును చదివి అందులోని సంగతులను తెలిసికొని నాము. దానియందలి కథలు మిక్కిలి మనోహరముగ, సులభశైలిగను నుండుటచే వాటిని చక్కగా నేర్చుకొను చున్నారు. మేము తెనాలి, ఎ, ఇ, యల్, యం. స్కూలులో 4-వ తరగతియందు చదువుకొనుచున్నాము. మా బడి యందు సుమారు 120 మంది పిల్లలున్నారు. అందరును హిందువులే. అయినను మేము బైబిలు చదువుటయందు ఆసక్తి గలవారమై యున్నాము. ప్రతి ఆదివారమును మా బడి యందు మా మానేజరుగారివల్ల ప్రార్థనాకూటము జరుగును అప్పుడు సుమారు 200 మంది వత్తురు. కొంతసేపువరకు దైవప్రార్థన జరిపి పిల్లలకు బొమ్మలును పుస్తకములును పంచిపెట్టబడును. మా మానేజరుగారు యగు రెవరెండు. జి. రేమండు హోప్ దొరగారు మాయందు యెంతో దయగా నుండి మా విద్యాభివృద్ధికై పాటుపడుచు మేము ఏ యాట వస్తువులను కోరిన ఆ యాటవస్తువులను ఇచ్చుచు మమ్ములను ఎంతో దయగా చూచుచున్నందులకు సర్వేశ్వరుని కనేక వందనములు చేయుచున్నాము. ఏప్రిల్ 5-వ తారీఖున మన బాలమిత్ర సంపాదకురాలగు మెసెర్సు మెకాలెమ్మ

దొరసానమ్మగారు మా బడికి దయచేసి మమ్ములను చదువుకొనుమని ప్రోత్సాహపరచి మా విషయమై వారు చూపిన దయకు దేవుడు ఆమెను రక్షించుగాక యని మా బడిపిల్లలందరము ప్రార్థించుచున్నాము.

ప్రియబాలమిత్రులారా మీకు అందరకు అనేకవందనములు.

ఇట్లు మీ ప్రియబాలమిత్రులు
కరి రాజ్యలక్ష్మి నరసింహారావు,
గూడ. సీతారామయ్య,
కరి. సూర్యనారాయణరావు,
తెనాలి

---

ఒకడు సర్వలోకము సంపాదించుకొని తన ప్రాణము పోగొట్టుకొనినయెడల వానికేమి ప్రయోజనము.

C. L. S. PRESS, MADRAS—1916